తా॥ తామ్రమును పలచగ రేకులుచేసి అగ్నిలోకాచి తొలుత చెప్పినరసములలో ప్రతిదానియందు నేడేడుమార్లు ముంచిన నదిశుద్ధియగు - పిదప దానికిసమముగశుద్ధిజేసినపాదరసమును తామ్రపురేకులను ఖల్వములోవైచి యా తామ్రపు రేకులు తెల్లగనగువరకు నిమ్మపండ్లరసముచే ఖల్వమున జక్కగమర్దింపుచుండవలయును.

శ్లో॥ సుశుద్ధగంధంద్విగుణంసుమందంవిమర్ధయేద్ధాన్యరసేనసార్ధమ్ । ప్రలేపయేత్తానిచపత్రకాణిశుష్కేత్తతోదార్ఢ్యయుతేసుభాండే। నిరుధ్యచాన్యేనశరావకేణప్రపూరయేద్వాలుకయాచభూత్యా । వహ్నిర్విదేయోథశనైశ్శనైస్తైర్యామైశ్చతుర్భిర్మ్రియతేహిశుల్బమ్ ॥

తా॥ పైమర్దించియునిచిన రేకులకు ద్విగుణముగ శుద్ధిజేసిన గంధకమును ధాన్యామ్లరసముతో జక్కగమర్దించి తామ్రపు రేకులను లేపనముజేసి యెండించి ప్రమిదలయందునిచి చీలమన్నుచేసి యొకదృఢమైన కుండలోనిసుక, బూడిదెబోసి దాని మధ్యమున చీలజేసినదానినునిచి నాలుగుఝాములు మెల్లమెల్లగ పాకముచేసిన తామ్రము జక్కగ భస్మమగు.

శ్లో॥ పిష్ట్వార్ధగంధేనపునశ్చఖల్వేసంభావచేత్పూరణజద్రవేన । ఏకందినంనిర్జలనోవిదేయశ్శరావకైరేవగజాద్వయంతే।తతోవిదేయాఃఖలుపంచభావాఃపృథక్పృథక్తైస్సుభపంచగవ్యైః। ఈషద్విదేయః ఖలుగంధకోసౌపుటేపుటేనాత్రవిచారణీయమ్ ॥

తా॥ పిదప నాతామ్రభస్మమును దానికర్ధభాగము శుద్ధిజేసిన గంధకమును ఖల్వమునవైచిఅడవికందరసముచే భావనచేసిప్రమిదెలయందునిచి చీలమన్నుజేసిఒకదినము అగ్నియుండునటులగజపుటంబిడవలయు - పిదపనాతామ్రభస్మమును ఆవుపాలు, పెరుగు నెయ్యి, గోమూత్రము, ఆవుపేడరసము, వీనిచే ప్రత్యేకప్రత్యేకములుగభావనచేసి ప్రతి పుటంబునను కొంచము గొంచముగ శుద్ధిజేసిన గంధకము కలిపి పుటంబిడవలయు.

శ్లో॥ తామ్రస్యఖండస్యపుటోవిధేయస్తతఃపరంశుద్ధరసంహిశుల్బమ్ । మయూరకంఠాభమిదంయదాస్యాత్తదామృతంశుద్ధతమంవదంతి। యత్నేవిశంచేద్వితనోతినాంతింగోదుగ్ధకైర్నైవవిశోధయేత్తత్ । కృష్ణామధూభ్యాంపరిసేవయేద్ద్వైగ్రీష్మంశరద్వ్యంజవిహాయమానమ్ ॥

తా॥ పిదప నాతామ్రభస్మమును తేనె, కలకండ, వీనిలో పుటంబులిడిన నది పరిశుద్ధంబగు. మఱియు మయూరకంఠవర్ణంబుగనుండు తామ్రభస్మము పరిశుద్ధమయిన దనిచెప్పంబడు - ఇట్టిభస్మంబును సేవించియు నొకానొకసమయమున అధికముగ వమ

తా॥ లోహము కాంత, తీక్ష్ణ, ముండములన త్రివిధంబులని ఆయుర్వేదవేత్త లువచించెదరు-అవి క్రమంబుగనుండుటంజేసి కాంతలోహమే గ్రాహ్యంబని వైద్యవరులు వచించెదరు.

శ్లో॥ కాంతాభావే తీక్ష్ణలోహంచ గ్రాహ్యం తల్లోహం కైసంస్కృతంత్వంసిద్ధత్త్రే । ముండంత్వ్యాజ్యంసర్వథానైవగ్రాహ్యం యస్మాత్తస్మిండే భూరిదోషాన్వదంతి ॥

తా॥ కాంతలోహము దొరకకుండిన నెడ తీక్ష్ణలోహమును గ్రహింపందగు అది పాకావస్థచే మృదువుగనుండు ముండలోహము మహాదోషకారి యగుటంజేసి సర్వప్రకారములచే నది అగ్రాహ్యంబుగనుండు.

లోహదోషము.

శ్లో॥ గరళంక్లమవాంతివీర్యహాతిదోషాః ప్రవదంతిలోహకే । అథశోధనభావితాన్ఫుటితాన్ విధినైకేనవదంతిసూరయః ॥

తా॥ లోహమునకు విషము, గ్లాని వాంతి, వీర్యహాని అనుదోషంబులు కలవని ఆయుర్వేదవేత్తలు వక్కాణించెదరు- అవి నివారించుటకై శోధన భావన పుటముల తామ్రమువలెనే జేయందగు.

శ్లో॥ (అన్యచ్చ) కాంతలోహంచ సుగ్రోక్తం రోమకంభ్రాజకం తథా । చుంబకంద్రావకంచేతిగుణాస్తస్యోత్తరోత్తరమ్ ॥

తా॥ కాంతలోహము రోమక, భ్రాజక చుంబక, ద్రావకములన నాలుగు విధంబులు- అందు క్రమంబుగ నొకదానికన్న నొకటి గుణాధిక్యంబుగలదిగనుండును.

శ్లో॥ ముండాదిసర్వలోహాని తామ్రవచ్ఛోధయేత్సుధీః త్రయోదశపలాదూర్ధ్వంనహీనేత్షట్పలాదధః ॥

తా॥ ముండము మొదలగు సర్వలోహములను తామ్రమువలెనే శుద్ధిచేయవలయు శుద్ధిజేయునెడ లోహమును పదమూడుపలంబులకన్న నధికంబుగను, ఆరుపలంబులకన్న తక్కువగను, నుంచుకొనందగదు.

శ్లో॥ లోహపాకస్త్రిధాప్రోక్తో మృదుమధ్యఖరస్తథా । పంకశుష్కాఖ్యసౌపూర్వ్యౌవాలుకాసదృశఃఖరః ॥

తా॥ లోహపాకము, మృదు, మధ్య, ఖరంబులన త్రివిధంబులు. అందుకొంచెము తడితో గూడియుండునది మృదుపాకము గలదనియు, శుష్కించియుండునది మధ్యమపాకముగలదనియు, యిసుకవలెనుండునది ఖరపాకముగలదనియు, నెరుంగదగు.

తా॥ ఆనుమంత్రమును పఠింపుచు బలియొసంగవలయు.

భక్షణమంత్రము.

ఓం॥ అమృతంభక్షయిష్యామిస్వాహా॥

తా॥ అనుమంత్రమును పఠింపుచు భక్షింపవలయు.

లోహసేవనయందు వర్జింపదగినపదార్థములు.

శ్లో॥ కూశ్మాండంతిలతైలంచమాషాన్నంరాజికాంతథా। మద్యమమ్లరసంశాకంలోహసేవీనభక్షయేత్। నారికేళఫలికందంకాంజికంకరమర్దకమ్। కకీరంకారవేల్లంచషట్కకారాన్వివర్జయేత్॥

తా॥ లోహభస్మమును సేవించువారు గుమ్మడికాయ, నూనె, మినపఅన్నము ఆవాలు - మద్యము, పులుసు ఆకుకూరలు, అరటికాయ, కంద, చిపికండ, పుల్లనికలి, కరమర్దకము, కరీరము, కాకరకాయ, వీనిని భక్షింపదగదు.

లోహగుణము.

శ్లో॥ లోహంమృతంకజ్జలసన్నిభంతుభుంక్తేసదాయోరసరాజయుక్తమ్। తస్యైవదేహేనభవంతిరోగామృత్యోఽపికాపుఃపునరేతిధామ॥

తా॥ కజ్జలి సదృశమగు లోహభస్మమును శుద్ధిజేసిన పాదరసముతో జేర్చి సేవించిన యేరోగంబును శరీరమున అంటకనుండుటయేగాక కామహీనులకు మిగుల కామవృద్ధిని సరాగంబుగంజేయు.

శ్లో॥ లోహోజంతువికారపాండుపవనక్షీణత్వపిత్తామయస్థౌల్యార్శోగ్రహణీజ్వరాగ్నికఫజిచ్ఛోఫప్రమేహవ్రణజిత్। గుల్మప్లీహవిషాపహంబలకరంకాంతాజనానందకం సౌఖ్యాలంబిరసాయనంమృతిహరం దృష్టేశ్చకాంతిప్రదమ్। ఆమవాతగదేషుశోఫనంపాండుమేహగదనాశనేగజః। దుష్టకుష్ఠపలితాస్రవాతజిచ్ఛ్విత్రజరామృతివలీవినాశనః॥

తా॥ లోహభస్మము జంతువికారము, సర్పదంష్ట్రవిషము, పాండువు, వాతక్షీణత్వము, పిత్తరోగము, శరీరస్థౌల్యము, మూలవ్యాధి, గ్రహణి, జ్వరము కఫము, శోఫ, ప్రమేహము, గుల్మము, ప్లీహము, విషము, ముదిమి, నేత్రరోగము, ఆమవాతము, మహాకుష్ఠువులు, శ్వేతకుష్ఠువులు, రక్తవికారము, మృత్యువు, వలీపలితములు మొదలగురోగంబుల హరింపజేసి కడుబలంబును, అనేకస్త్రీలతో రమించుటకు తగిన శక్తిని గలుగంజేయు.

శ్లో॥ సశోఫపాండుక్షయకాసశూలమందప్రమేహాంశ్చవిరహాలీమ

ద్రవ్యైర్భావ్య దుగ్ధే । తతశ్శుష్కం లఘుత్వాక్కదంబస్య నీరేసు శుష్కాల యేత్త్రిసప్తకం సప్తవారాన్ ॥

తా ॥ వంగమును మూత్రవర్గము, అమ్లవర్గము, పలుద్రవ్యములుకూడిన క్షారజలము, బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు, కదంబవృక్షరసము, వీనిలో ప్రతిదానియందును నేడేడుమార్లు కరిగించిపోసిన నది శుద్ధియగు.

వంగమారణము.

శ్లో॥ త్రపుశుద్ధంసుద్రుతంసుపారదేనసుభదుగ్ధేనరవేర్దశాంశకేన। దృఢదండేనచదాడిమోద్భవేనఘృష్టితంస్యాద్భస్మతుస్వైః క్షిరసేగణ్నా ॥

తా ॥ శుద్ధిజేసినవంగమునకు దశమాంశముగ శుద్ధిజేసిన పాదరసమును జిల్లేడుపాలునునొకమూకుడులోవైచికరిగించిదాడిమకొయ్యచే నొక్కఝామువరకుబలముగ మర్దింపుచుండిన వంగము భస్మమగు.

శ్లో ॥ సకలమేహానసమీరణనాశకృచ్ఛ్రిష్మకఫఘ్నస్యు పాండుహీనాశనః । శ్వాసనశూలయకృద్వమనార్తిహృత్ప్రదరమేవనిహంతిసువంగకః॥

తా ॥ సువంగభస్మము సకలమేహములను భ్రమ, కఫము, క్షయరోగము, పాండువు, శ్వాస, శూల, యకృత్తు, వమనము, ప్రదరరోగము వీటిని హరింపంజేయు.

శ్లో ॥ ఆయుఃప్రదాతా బలవీర్యకర్తా రోగాపహం మదనస్యకర్తా । వంగేనతుల్యంనచకించిదన్యద్రసాయనంశ్రేష్ఠతరంనరాణామ్॥ బల్యం పాచనదీపనంరుచికరంప్రజ్ఞాకరంశీతలమ్ । సౌందర్యైకవివర్ధనంసహ్యాతతరం నీరోగతాకారణమ్ । ధాతుస్థైర్యకరంక్షయక్షయకరం సర్వప్రమేహాపహామ్ । వంగంభక్షయతోనరస్యనభవేత్స్వప్నేపిశుక్రక్షయః ॥

తా ॥ వంగభస్మము ఆయుర్వృద్ధి, బలము, వీర్యము, రోగనాశము, కామము వీనిని గలుగంజేయు. అందనంజేసి వంగభస్మమునకు సమానమైన అన్యరసాయనము మఱియొద్దియును లేకయుండు. మఱియు, నావంగభస్మము, బలము, అగ్నిదీపనము పాచనము, రుచి, బుద్ధి, శీతలము, సౌందర్యవృద్ధి, వేగము సర్వరోగనాశనము, ధాతుస్థైర్యము, క్షయరోగనాశనము, సర్వప్రమేహనాశనము వీనిని గలుగంజేయుట యేగాక దీనిని సేవించినవారికి స్వప్నంబున సగా శుక్రక్షయము గలుగకయుండు.

పాకదోషము.

శ్లో ॥ పాకేనహీనౌఖలువంగనాగౌ కుష్ఠానిగుల్మాని మహోత్రరోగాన్ । పాండుప్రమేహాపచివాతశోఫజ్వరంబలాపహారం కురుతేనరాణామ్॥

తా॥ అపక్వ వంగభస్మము కుష్టువు, గుల్మము మొదలగు మహారోగంబులు, పాండువు, ప్రమేహము, అపచి వాతము, రక్తవికారము కామ క్షయము, వీనినిజనింపంజేయు.

### వంగేశ్వరవిధి.

శ్లో॥ చతుర్భాగాహృతవంగకస్యాప్యేకోవిభాగోమృతపారదస్య। భాగద్వయంచైవమృతాళకస్య హ్యేకోవిభాగోమృతశంఖకస్య। సర్వస్యచూర్ణంసహకాంజికేనవిమర్ద్యచైత్సంపరిపాచయేచ్చ। శరావకైర్వ్యాసరతస్సువహ్నౌవంగేశ్వరస్స్యాద్గజపుటాహ్వయంతే॥

తా॥ వంగభస్మము (౪) భాగములు - రసభస్మము ౧ భాగము - తాళకభస్మము (౨) భాగములు - శంఖభస్మము (౧) భాగము - ఇటులవీటిని ఖల్వమునవైచి పుల్లనికలితో జక్కగమర్దించి బిళ్లచేసియెండించి శరావములయందునిచి స్వల్పాగ్నిచే నొకదినము గజపుటంబునపక్వముచేసిన నది పరిశుద్ధమయిన వంగేశ్వర రసంబగు.

### వంగేశ్వరగుణము.

శ్లో॥ భ్రమతమకకఫేవాశ్వాసకాసక్షయేవా విషరుధిరకలేవా తపిత్తప్రమేహే। జ్వరగ్రహణిసశూలేకుష్ఠపాండ్వల్పవీర్యే బహుగదవతిశస్తోరస్యవంగేశ్వరోసౌ॥

తా॥ శుద్ధవంగేశ్వర రసము భ్రమ, తమకము, కఫము, శ్వాసకాసలు, క్షయరోగము, విషవికారము రక్తవికారజనితపీడ, వాతము, పిత్తము, ప్రమేహము, జ్వరము, సంగ్రహణి, శూల, కుష్ఠువు, పాండువు, క్షీణత్వము, మొదలగుబహురోగముల నశింపజేయుటయందు హితకారిగనుండు.

### నాగాశ్రితదోషములు.

శ్లో॥ భుజంగమేద్వ్యౌకథితౌచదోషౌవాంతిశ్చతాపోథవిచార్యబుద్ధ్యా। తచ్ఛోధనంసంపరకీర్త్యతేఽస్మ్యై యచ్ఛోధనేదోషవివర్జితంస్యాత్॥

తా॥ నాగము వాంతి, తాపదోషద్వయముల నాశ్రయించి యుండుననిపెద్దలువచించెదరు. అవినివర్తించుటకైతగిన శుద్ధులవచించెద.

### నాగశుద్ధి.

శ్లో॥ ఫలత్రికకషాయేవాకుమారీరసేవాకరివరసలిలేవాగాలయేత్సప్తవారాన్। ఖదిరదహనతప్తంలోహపాత్రే స్థితంస్యాత్తదనుసపదినాగోజాయతేశుద్ధభావమ్॥

తా॥ నాగమును త్రిఫలకషాయము, ఘృతము, కలబందరసము, కరివరరసము వీనిలో ప్రతిదానియందును నేడేడుమార్లు భావనచేసిన నదిశుద్ధియగు - పిదప దానిని నొకయినుపగరిటెలోవైచి అగ్నిలోనునిచి చంద్రకొయ్యచే మర్దింపుచుండిన నాగము శుద్ధియగు.

## నాగమారణము.

శ్లో॥ భుజగపీనహిశుద్ధసుఖర్పరే ద్విగుణశుద్ధమనశ్శిలయాసహ। సుదృఢకింశుకకాష్ఠసుదర్వికా సపదిమృత్యుముపైతసుఘర్షితమ్ ॥ ఈషచ్ఛిలానాగలతారసేనసార్ధంవిమర్ద్యైవపునఃపునశ్చ । ఏవంహిద్వాత్రింశపుటైశ్చవేనిరుచ్ఛాంయాతిభుజంగమోపి ॥

తా॥ శుద్ధిచేసిన మణిశిల (౨) భాగములు-శుద్ధిచేసిన సీసము (౧) భాగము- ఇటులవీటిని మంటిమూకుడులోవైచి దృఢమయిన మోదుగ కాష్ఠముచేసిన గరిటచేనే నిమర్దింపుచుండిన నాగము భస్మంబగు పిదపనాభస్మమునకొంచముగ మణిశిలనువైచి తమలపాకుల రసముచేమర్దించి బిళ్ళచేసి యెండించి ప్రమిదెలయందునిచి చీలమన్ను చేసి పుటంబిడవలయు ఇటుల (౩౨) పుటంబులిడిన సీసము నిర్దోషముగ సింధూరమగు.

## నాగగుణము.

శ్లో॥ క్షయపవనవికారేగుల్మపాండ్వామయేషు భ్రమకృమి కఫశూలే మేహకాసామయేషు । గ్రహణిగుదగదేపైనష్టవహ్నౌప్రశస్తస్స్య భపిధికృతనాగఃకాముకార్శ్యందదాతి ॥

తా॥ నాగభస్మము క్షయరోగము, వాతవికారము, గుల్మము, పాండువు భ్రమ క్రిమిరోగము, కఫము, శూల, ప్రమేహము, కాస, గ్రహణి, భగందరము, అగ్ని మాంద్యము మొదలగురోగములనశింపంజేయుటయేగాక వీర్యవృద్ధినిసగాగలుగంజేయు.

శ్లో॥ నాగోహినాగశతతుల్యబలందదాతి వ్యాధింశ్చనాశయతి జీవితమాతనోతి । వాయుంక్రిమీనపినిహంతిసతిక్తమేషం వృష్యంచపిత్తకరమాశుమృతంనిహంతి ॥

తా॥ నాగభస్మము నూరుయేనుగులబలమును గలుగంజేయునదిగను, సర్వరోగముల పోగొట్టునదిగను, ఆయుర్వృద్ధికారిగను, వాత కృమిమొదలగురోగములబోకడుచునదిగను, తిక్తరసముగలదిగను, శీతకారిగను, వీర్యవృద్ధికరముగను, పిత్తకరముగను అకాలమృత్యువును పోకడుచునదిగనునుండును.

## అపక్వదోషము.

శ్లో॥ కుష్ఠానిగుల్మారుచిపాండురోగాన్ క్షయంకఫంరక్తవికార

కృచ్ఛ్రమ్ । జ్వరాశ్మరీశూలభగందరాద్యం నాగం హ్యపక్వం కురుతే నరాణామ్ ॥

తా॥ అపక్వనాగభస్మము కుష్ఠువు గుల్మము అరుచి పాండురోగము, క్షయరోగము, కఫము, రక్తవికారము, మూత్రకృచ్ఛ్రము, జ్వరము, అశ్మరి, శూలభగందరము, వీటిని గలుగఁజేయును.

నాగేశ్వరవిధి.

శ్లో॥ మృతభుజంగమచూర్ణపలద్వయం దరదశుద్ధరసాయసలద్వయమ్ । పలచతుష్టయభాగమనశ్శిలాస్సకలచూర్ణసమోమలగంధకః । తదనునింబరసేనవిమర్దనే దృఢజపుటే పుటితో దృఢసంపుటే ॥ పనశిలభియుతే దినమేకతో భుజగభోమమునాగపతిర్భవేత్ ॥

తా॥ సీసభస్మము (౨) పలములు శుద్ధిచేసిన యింగిలీకచూర్ణము (౨) పలములు మణిశిల (౧) పలము ఇటులసీటిని సేకముజేసి దీనికి సమముగ శుద్ధిచేసిన గంధకమును కలిపి చక్కగ నిమ్మపండ్లరసముచే మర్దించి బిళ్లచేసి యెండించి క్రమిదెల యందునిడి చీలమన్నుబూసి గయిరుపిడకలచే నొకదినముగ జపుటంబిడినది నాగేశ్వరరసమనంబడును.

నాగేశ్వరగుణము.

శ్లో॥ యోనాగరాజం జపినిరామే తాంబూలపత్రైస్సహసేవయేద్వై వల్లద్వయం పిప్పలికాయుతం వై స్త్రీణాం సహస్రేణ నతృప్తిమేతి॥

తా॥ పైచెప్పిన నాగేశ్వరరసమును రెండువల్లముల ప్రమాణము (కరుగురెగింజలయెత్తు) తమలపాకులలోనునిచి యించుకించుకముగ పిప్పలి చూర్ణముకలిపి ఉదయకాలంబున సేవించిన సహస్రస్త్రీలతో రతికేళిం దేలినను తృప్తికలుగకయుండును.

శ్లో॥ అతిమేహంబుజం సకామలం వాగుణరోగేచ సమీరణభ్రమే వా । శ్వాసక్షయపాండుమందవహ్నీన్ భుజగేంద్రస్సతతం నిహంతి శీఘ్రమ్ ॥

తా॥ మఱియును నాగేశ్వరరసము ప్రమేహము, కామిల, గుణరోగము వాతజనితభ్రమ, ఉన్మాదము, శ్వాస, క్షయము, పాండువు, అగ్నిమాంద్యము మొదలగు రోగముల శీఘ్రముగ నశింపఁజేయును.

అరశోధనము.

శ్లో॥ అద్విత్రీయే భుజంగా శేకథితే భిషజాంవరైః । శోధనంక్రియతే యిష్యేపరమాంశస్యవిధిప్రాగ్వనేషమ్ ॥

తా ॥ ఇత్తడిని వైద్యశ్రేష్ఠులగువారు యథావిధిగ శుద్ధిచేయతగిన విధానమును వివరించెద.

శ్లో ॥ క్వాలత్థాంభేటక్రితైలే తక్రైగోమూత్రేపశ్చాత్కాంజికేసం క్షిప్తైస్త్రి! తప్తాన్యప్తాన్యారపత్రాణిపఞ్చాశుద్ధాన్యేవంసంభవేయు స్త్రపానీహ ॥

తా ॥ ఇత్తడి రేకులను అగ్నిలో పలుమారు తప్తముచేసి ఉలవకట్టు, మజ్జిగ, తైలము, గోమూత్రము, కలి, వీనిలో ప్రతిదానియందును యేడేడుమార్లుముంచినసది శుద్ధియగు.

## ఇత్తడిమారణము.

శ్లో ॥ ఆరస్యపత్రాణివిలేపయేద్వై సూర్యస్యదుగ్ధేనచగంధకేన । సమంగజాహ్వాసుద్ధేః వేత్పుటద్వయేనచాపిభవేత్సుభస్మ ॥

తా ॥ శుద్ధిచేసిన ఇత్తడి రేకులకు సమముగ శుద్ధిచేసిన గంధకమునుగ్రహించి జిల్లేడుపాలతో నూరి యా రేకులకు లేపనముచేసి యెండనెండించిప్రమిదెలయందునిచి రెండుగజపుటంబులిడిన ఇత్తడి భస్మంబగు.

## ఇత్తడిభస్మగుణము.

శ్లో ॥ సకలవాయురుజంగుదజాంరుజం గ్రహణికాం కఫపాండుభవాంరుజమ్ । శ్వసనకామలశూలభవాంరుజంహరతి భస్మితదారకసంభవమ్ ॥

తా ॥ ఇత్తడిభస్మము సమస్తవాతజనిత రోగంబులు, గుదరోగము, సంగ్రహణి కఫము, పాండువు, శ్వాస, కామిల, శూల వీటిని నశింపంజేయు.

## అపక్వదోషము.

శ్లో ॥ వివిధరోగచయంకురుతేభ్రమింగుదరుజం హ్యాతిమేహరుజాంగణమ్ । వివిధతాపకమాతనుతేతనౌవిమృతమారకమాశుహిమృత్యుదమ్ ॥

తా ॥ అశుద్ధమగు ఇత్తడి భస్మముపలువిధరోగసంచయము, భ్రమి, గుదరోగము ప్రమేహము, పలువిధజ్వరములు, మృత్యువు, వీటినిగలుగంజేయు.

## సప్తధాతుపరీక్షాక్రమము.

శ్లో ॥ స్వర్ణంకపోతకంఠాభమారమేవంసదాభవేత్ । శుల్బం

మయూరకంఠాభం తారవంగౌసముజ్జ్వలౌ। కృష్ణసర్పనిభం నాగం తీక్ష్ణకం కజ్జలప్రభమ్ । తేనాశుద్ధింవిజానీయాత్సర్వంభ్రాంతివివర్జితమ్ ॥

తా ॥ సువర్ణము ఇత్తడి, వీని భస్మంబులు పావురపిట్టకంఠముతో తుల్యమగు వర్ణముగలవిగను, తామ్రము నెమలి కంఠముతో తుల్యమగు వర్ణముగలదిగను, రౌప్య వంగభస్మంబులు స్వచ్ఛమయిన కాంతిగలవిగను, నాగము కృష్ణసర్పవర్ణతుల్యముగను లోహభస్మము కజ్జలితో తుల్యముగను, నుండవలయును ఈసప్తధాతు భస్మంబులు వాంతి భ్రాంతి దోషరహితంబులుగ నుండెనేని యవిక్రమంబుగ శుద్ధిచేయబడినవని నెఱుంగందగు.

శ్లో ॥ ఏతత్సర్వంయదానస్యాత్పుటానస్యాన్నమాచరేత్ । సేవనస్యప్రమాణంచకథయిష్యేపితేషిణః ॥

తా ॥ సువర్ణాదిభస్మములకు పైచెప్పినకపోతకంఠాది వర్ణంబులు గలుగునంతకు పుటంబులు వేయుచుండవలయు - ఆసప్తధాతు భస్మసేవన ప్రమాణంబుల ఉత్తరత్ర వచించెద.

## ఔషధములచేయుటకు ప్రశస్తస్థానంబులు.

శ్లో ॥ ఊర్ధ్వమాచ్ఛాదితేదేశే వస్త్రాద్రిప్రావృతేతథా । గృహే వానిర్జనేపూతే భేషజంకారయేద్భిషక్ ॥

తా ॥ ఊర్ధ్వభాగమున నాలుగుపార్శ్వములయందు వస్త్రాదులచే కప్పబడియుండెడిప్రదేశంబున నేని పవిత్రగృహంబుననేని, జనసమూహము లేని గృహంబుననేని ఔషధముల చేయవలయు.

శ్లో ॥ ఊర్ధ్వముఖైశ్శిలాఖల్వైశ్శిలాయాం మర్దనేత్సదా । తథాహిద్విగుణంవీర్యంస్యాదీశాననముఖోయది ॥

తా ॥ ఔషధము నూరేశిలను ఊర్ధ్వముఖంబుగ పట్టుకొని యీశానముఖంబుగ కూర్చుండి ఔషధమును ఖల్వమున మర్దించిన దానికి ద్విగుణవీర్యముగలుగు.

శ్లో ॥ తింత్రిణీఖదిరాదీనాం యద్దృఢేవిమలేతథా । ఉలూఖలేఖేదయిత్వాగ్రాహ్యంభేషజముత్తమమ్ ॥

తా ॥ చింత, చండ్ర మొదలగు వానిచే దృఢమయి నిర్మలమగురోలునుఉత్తమ ఔషధముల దంచునిమిత్తము వైద్యుడునిర్మింపవలయు.

ఔషధములస్పృశింపటకనర్హులు.

శ్లో॥ రజస్వలాంవంధ్యావాపాషండీయదివాస్పృశేత్। ఆమయావీహిభైషజ్యంనిర్వీర్యంజాయతేతదా॥

తా॥ రజస్వలలు వంధ్యాస్త్రీలు, పాషండులు, రోగులు, వీరలు ఔషధము నుస్పృశింపకూడదు స్పృశించిన నౌషధము నిర్వీర్యంబగు.

ఔషధములు జేయతగనిస్థలములు.

శ్లో॥ నకార్యమౌషధంశూన్యేనౌకాయాంహట్టమండలే। పథితరుతలేవాపిశూన్యేశూన్యఫలంభవేత్।

తా॥ శూన్యస్థలము, ఓడ, బాజారు, మార్గము, వృక్షమునకు క్రిందిప్రదేశము వీనియందుఔషధములుజేసిన నవి నిర్వీర్యంబులగు.

ఔషధపాత్ర.

శ్లో॥ ఔషధంహేమరజతమృద్భాజనపరిస్థితమ్। పిబేత్సంచింత్యవిష్ణుంచపీత్వాపాత్రమధోముఖమ్॥ నికుష్యాత్స్యసలిలంతాంబూలాద్యుపకల్పయేత్। మాత్రయాహీనయాద్రవ్యోవికారంననివర్తయేత్॥

తా॥ సువర్ణము, రజతము, మృత్తిక, వీనిలో దేనిచేనైన జేయంబడినపాత్ర యందు ఔషధమునునిడివిష్ణుధ్యానము జేసి, పానంబొనర్చియాపాత్రయందు శిష్టమగు కషాయాదులు భూమియందు పడునటులనాపాత్రను అధోముఖంబుగ నుంచవలయు- పిదప తాంబూలాదుల భక్షింపవలయు-ఔషధమును హీనప్రమాణముగ సేవించిననది రోగమును నివర్తింపజేయకుండు.

శ్లో॥ ద్రవ్యాణామతిబాహుల్యాద్వ్యాపత్సంజాయతేభృశమ్। మాత్రాయామాశువపుషంస్థానమగ్నింబలంవయః। వ్యాధింద్రవ్యంచకాలంచవీక్ష్యమాత్రాంప్రకల్పయేత్॥

తా॥ ఔషధద్రవ్యబాహుళ్యముచే రోగికి వికారముగలుగు - అందునంజేసి శరీరము, స్థానము అగ్ని, శక్తి, వయస్సు, వ్యాధి, ద్రవ్యము, కాలము మొదలగువానిని వయిద్యుడెఱింగి ప్రమాణానుగుణ్యముగ నౌషధమును బ్రయోగింపవలయు.

శ్లో॥ ఉత్తమస్యపలంమాత్రాత్రిభిశ్చాక్షైశ్చమధ్యమే। జఘన్యస్యపలార్ధేనస్నేహక్వాథౌషధేషుచ। సార్ధపలంపలంపార్ధంపిదధ్యాద్దుగ్ధఖండయోః॥

తా॥ స్నేహము, కషాయము, ఇష్టి యౌషధములయందు ఉత్తమయౌషధమును పలప్రమాణంబును, మధ్యమ యౌషధమును మూడుతులముల ప్రమాణంబును, నికృష్టౌషధమును అర్ధపలప్రమాణంబును, ఒసంగవలయును- గుటికలును యౌషధమును ప్రయోగించునెడల ఒకటిన్నరపలప్రమాణంబును, కల్కంబయందు ఒసంగునెడల అర్ధపలప్రమాణంబును, నివ్వవలయు.

శ్లో॥ శ్రేష్ఠమధ్యమహీనేషు మాత్రేయం సద్భిః కృతా । అత్ర స్యాత్ సాప్రసుతం పంచరక్తిమాసాధకం పలమ్ । మోదకం వటకం లేహం కర్షమాత్రం ప్రయోజయేత్ । కర్షద్వయం పలం వాపి దేయం కోష్ఠాద్యపేక్షయా ॥

తా॥ మునులు శ్రేష్ఠ, మధ్యమ, హీన అవుషధములయందు ప్రమాణంబులు త్రివిధంబులని నచించెదరు. అంగుసుశ్రుతములో మోదకము, వటకము, లేహము, ఈనివియు యమయి జెప్పంబడియుండెడు పంచరక్తిమాత్రా ప్రమాణము శ్రేష్ఠంబు, మధ్యమమాత్రాప్రమాణము ఒకపలము - హీనప్రమాణము ఒకకర్షము - కోష్ఠాదిరోగంబులను రెండుకర్షంబులు లేని, లేక ఒకపల ప్రమాణం జేని, యొసంగవలయు.

శ్లో॥ శ్రేష్ఠమధ్యమహీనేషు ద్వాదశాష్టచతుష్టయైః । మాషైర్గుగ్గులమాత్రేయం కోష్ఠంవీక్ష్యవిభావయేత్ ॥

తా॥ శ్రేష్ఠమధ్యమ హీనప్రమాణంబుల కోష్ఠాదిరోగబలంబు నెఱింగి ౧౨, ౮, ౪ మాషములప్రమాణముగ సమస్తగుగ్గులసంబంధములగు అవుషధముల కల్పన జేయవలయు.

శ్లో॥ గుంజామాత్రరసం దేవి హేమభస్మం చ దాపయేత్ । తారం ద్విగుంజకం ప్రోక్తం రవిజీర్ణం త్రిగుంజకమ్ ॥

తా॥ సువర్ణభస్మము, పాదరసము వీనిని గుంజాప్రమాణంబును, రజితభస్మమును ద్విగుంజాప్రమాణంబును, తామ్రభస్మమును త్రిగుంజాప్రమాణంబును, ఒసంగవలయు.

శ్లో॥ తీక్ష్ణాభ్రనాగవంగానాం కర్పూరస్య శిలాజతోః । షడ్గుంజాప్రమితా మాత్రా నానోపరసమాసకమ్ ॥

తా॥ లోహము, అభ్రకము, సీసము, కర్పూరము, శిలాజిత్తు, వీనినన్నియు ఆరుగురిగింజలప్రమాణము సేవింపవలయు - మఱియును పలువిధములగు ఉపరసభస్మంబులు నాలుగు ప్రమాణంబున సేవింపజేయు.

శ్లో॥ సమవమాత్రం విషం దేవి గుంజామాత్రంచ కస్తికే। వజ్రంయవద్వయమితం తాలకంయావసప్తకమ్ ॥

తా॥ విషమును యవప్రమాణంబును, కస్తూరికి గుంజామాత్రంబును వజ్రభస్మమును (౨) యవలప్రమాణంబును, రజతభస్మమును (౭) యవలప్రమాణంబును, నివ్వవలయునని ఈశ్వరుడు పార్వతికి చెప్పెను.

శ్లో॥ తథా బుద్ధ్యా భిషక్ దద్యాత్ ప్రోక్తమాత్రేతికీర్తితా । కర్షాదౌ షట్పలంయావద్ద్రాత్రింశకం జలమ్ । తదస్తు కుడవం యావత్ర్యమష్టగుణం భవేత్ । చతుర్గుణో ముత్తర్దగ్ధం యావత్ప్రస్థాదికం భవేత్ ॥

తా॥ ఇట్టుల సామాన్యముగ మాత్రాప్రమాణమున చెప్పబడెను. కావున వైద్యుడు దేశకాలాదులను బుద్ధిచే నాలోచించి ఔషధద్రవ్యానాదిక ప్రమాణంబు నెఱింగి ప్రయోగించవలయు కర్ష ప్రమాణము మొదలు పలపర్యంతము చెప్పబడియుండెను శ్లోకమాన సంఖ్యాప్రకారము గ్రహింపబడియుండు స్థలంబున కర్షాది ప్రమాణము మొదలుపదియారింతలయుదకమును బోసంగవలయు - పలప్రమాణము మొదలు కుడవపర్యంతము చెప్పంబడియుండు శ్లోకమాన సంఖ్యాప్రకారము గ్రహింపబడియుండు స్థలంబున నెనిమిదింతల యుదకమును బోసంగవలయు - కుడవము మొదలు ప్రస్థమువరకు గ్రహింపబడియుండు స్థలంబున నాలుగింతల యుదకమును బోసంగవలయు.

శ్లో॥ కాలదోషావయోశక్త్యనరాణాం మందవీర్యతామ్ । అనిర్దిష్టప్రమాణానాం ప్రమాణమిదమీరితమ్ ॥

తా॥ కాలము, దోషము, వయస్సు, శక్తి, అల్పవీర్యము, మొదలగువాని నెఱింగి వైద్యుడు మాత్రాప్రమాణముల నొప్పింపవలయు. ఏయౌషధమునందు ప్రమాణము జెప్పబడకుండెనో ఆ స్థలంబున యీప్రమాణంబులనే సామాన్యముగ గ్రహింపవలయు.

సప్తధాతు సేవనమాత్రాప్రమాణము.

శ్లో॥ వల్లార్ధంకనకంచ కాంచనమితం రూప్యంచ శుల్బం తథా । తీక్ష్ణంవంగభుజంగ రనిచ సోవల్లార్ధవలోన్మితాః । తత్తుల్యా శుభ పిప్పలీ నిగదితా తాభ్యాం దర్శనోన్మితమ్ । సేవ్యంసంప్రతిహాయ గ్రీష్మశరదౌ తామ్రం సుసేవ్యం నరైః ॥

తా॥ సువర్ణ, రౌప్య, తామ్ర, భస్మంబుల ఒకటిన్నరగురిగింజ ప్రమాణంబును లోహ, వంగ, సీస, ఇత్తడి, భస్మంబుల తొమ్మిదిగురిగింజల ప్రమాణంబును, సేవిం

పవలయును. సువర్ణాది భస్మంబుల సేవించునెడవానిసమంబుగ శుద్ధిచేసిన పిప్పలిచూర్ణంబును, రెండుతులములతోనెనుకలిపి సేవింపవలయును - తామ్రభస్మమును గ్రీష్మ, శరదృతువులయందుతప్ప యితర అన్ని ఋతువులయందును సేవింపదగు.

ఇత్యనుపానమంజర్యాం సప్తధాతూనాం శోధనమా
రణం నామ పంచమస్సముద్దేశః.

---

శ్లో ॥ తాళేన వంగం దరదేన తీక్ష్ణం నాగేన హేమం శిలయా చ నాగమ్ । శుల్బం తథా గంధవరేణ నిత్యం తారం చ మాక్షికవరేణ హన్యాత్ ॥

తా ॥ తాళకముచే వంగమును, ఇంగిలీకముచే లోహంబును, సీసముచే సువర్ణంబును, మణిశిలచే సీసంబును, శుద్ధగంధకముచే తామ్రంబును, మాక్షికముచే రౌప్యంబును, మృతిజెందు.

ఉపధాతువులసంఖ్య.

శ్లో ॥ నీలాంజనం మాక్షికతుత్థ తాలం శిలాభ్రకో నాగరసకంచ సప్త। వదంతినిత్యంకిలచోపధాతూన్ త్వచ్ఛోధనం సంప్రతికీర్త్యతే ॥

తా ॥ * నీలాంజనము, మాక్షికము, మైలుతుత్తము, తాళకము, మణిశిల, అభ్రకము, రసకము, అనువానిని సప్తోపధాతువులని మునులు వచించెదరు. కావున వానిశోధనమారణంబుల వచించెద.

నీలాంజనశుద్ధి.

శ్లో ॥ నీలాంజనం గాఢతరం విచూర్ణం జంబీరతోయేన విభావయేత్తత్ । తీవ్రాతపే హ్యేకదినం సుశుద్ధం భవేత్సు కార్యేష్వథ యోజనీయమ్ ॥

తా ॥ నీలాంజనమును కడుసూక్ష్మముగ చూర్ణముచేసి దానిని నిమ్మపండ్లరసముతో భావనచేసి మంచియెండలో నొకదినము నెండించిన నది శుద్ధియగు అట్టినీలాంజనమును సర్వకార్యములయందుపయోగింపనగు.

హేమమాక్షికశుద్ధి.

శ్లో ॥ త్రయోపి భాగాశ్శుభమాక్షికస్య హ్యేకోపి భాగశ్శుభసైంధవస్య । తన్మాతులుంగస్వరసస్య భావో జంబ్వాథ జంబీర రసస్య భావః ।

---

* సురమరాయి.

పిడకలతో గజపుటంబడిన నాలుగు ఝాములలో మృతిజెందు - అందుపొగి లేకుండిన నదిమృతిజెందినదని నెఱింగి దానినిసాంగశీతలముగనువేసి యినుపపాత్రను తప్తముచేసి యందాశుక్లవర్ణహరితాళక భస్మమునువైచిన నది పరిశుద్ధంబగు.

## హరితాళగుణము.

శ్లో ॥ అశీతివాతాన్కఫపిత్తరోగాన్ కుష్ఠంచ మేహంచగుదామయంచ । నిహంతివల్లార్ధమితంచ తాళం షడ్వల్లఖండేనసమంచయుక్తమ్ ॥

తా ॥ వల్లార్ధప్రమాణశుద్ధహరితాళక భస్మమును ఆరువల్లములకలకండలోకలిపి సేవించిన ఎనుబదివాతములు, కఫపిత్తరోగములు, కుష్ఠువు, ప్రమేహము, మూలవ్యాధి, మొదలగు సమస్తరోగములు నశించు.

## అపక్వహరితాళదోషము.

శ్లో ॥ అశుద్ధతాళంఖలుపీతవర్ణంసధూమకంవాత చయంచపిత్తమ్ । పంగుత్వకుష్ఠేతనుతేనరాణాం దేహస్యనాశంప్రకరోతిసద్యః ॥

తా ॥ అశుద్ధ హరితాళకము వాతసంచయము, పిత్తము, పంగుత్వము, కుష్ఠువు, వీనినిగలుగంజేయుటయేగాక శరీరమునకు పీతధూమ్రవర్ణములను, శీఘ్రముగ నాశనంబును గలుగంజేయు.

## మణిశిలశుద్ధి.

శ్లో ॥ అజాయాశ్చమూత్రేపురాపాచయేద్వైమణిస్త్ర్యహం డోలకాయంత్రవర్యే। తదాపాచయేత్తప్తపాత్రేతుతైలైకంసుశుద్ధాశుభేసర్వకార్యేప్రయోజ్యా ॥

తా ॥ మణిశిలను డోలాయంత్రమున నునిచి అందు మేకమూత్రముబోసిమూడు దినములు వండి పిదప దానిని లోహపాత్రలోనునిచి క్షణకాలమువరకువేయించిన నది శుద్ధియగు. ఇట్టిమణిశిలను సర్వకార్యములయందుపయోగింపనగు.

## రసక (కపరి) శుద్ధి.

శ్లో ॥ పుంసశ్చమూత్రేరసకస్యచూర్ణంగోమూత్రకే సప్తపచేద్దినాని। సండోలకాయంత్రవరేసుశుద్ధంసంయోజనీయంసకలేతుకార్యే ॥

తా ॥ రసమును చూర్ణముజేసి డోలాయంత్రమునయునిచి అందునరమూత్రము, గోమూత్రముబోసి యేడుదినంబులు వండిన నది శుద్ధియగు - ఇట్టిదానిని సర్వకార్యములయం దుపయోగింపనగు.

## అభ్రకసంఖ్య.

శ్లో॥ అభ్రంసంకథితంచతుర్విధమథోశ్వేతంచకృష్ణంతథా।పీతంధూమ్రమథోవిమృశ్యసుధియాశ్వేతంచవిప్రాభిధమ్ । కృష్ణంతుక్షత్రియమేవపీతగగనంవైశ్యంచధూమ్రంతథా । శూద్రంసంగదితంభిషగ్వరగణైర్గ్రంథార్ణవజ్ఞైర్బుధైః ॥

తా ॥ అభ్రకము శుక్ల, కృష్ణ, పీత, ధూమ్రములన నాలుగు విధములు-అందు శ్వేతవర్ణముగలది బ్రాహ్మణజాతియనియు, కృష్ణవర్ణముగలది క్షత్రియజాతియనియు, పీతవర్ణముగలది వైశ్యజాతియనియు, ధూమ్రవర్ణముగలది శూద్రజాతియనియు, బుద్ధిమంతులగు వైద్యశ్రేష్ఠులు వచించెదరు.

శ్లో ॥ శ్వేతాభ్రకేరూప్యమథోవదంతికృష్ణాభ్రకేజాంబునదంసువైద్యాః । విచిత్రవర్ణత్వమథోపిపీతేనిరర్థకంధూమ్రసమానకాభ్రమ్ ॥

తా ॥ శ్వేతాభ్రకము రౌప్యగుణతుల్యముగను, కృష్ణాభ్రకము, సువర్ణగుణతుల్యముగను, పీతాభ్రకము అనేకగుణతుల్యముగను ధూమ్రవర్ణాభ్రకముగుణవిహీనముగను, నుండునని వైద్యవరులు వచించెదరు.

## అభ్రకదోషము.

శ్లో ॥ గగనేగరలాదిదోషకంభిషజస్సంప్రవదంతిమానినకి। అథతేస్యవిశుద్ధిమారణేకథయిష్యేవిధినైకవర్త్మనా ॥

తా ॥ అభ్రకమున విశేషదోషముగలదని వైద్యవరులు వచించెదరు-అదినివర్తించుటకై తగినశుద్ధిని, ఒక విధముగ మారణమును వచించెద.

## అభ్రకమారణము.

శ్లో ॥ఉలూఖలేఖండితమభ్రకృష్ణంక్షిపేత్తథాకాంజికఏవవైద్యః పిష్ట్వాశిలాయాంచపునఃపునశ్చన్యసేత్తుసత్యం కిలసప్తవారమ్ ॥ పశ్చాద్భాండముఖేనిబధ్యరుచిరంవస్త్రంజలైఃపూరయేత్ । తద్వ్రీహిత్వచ

యాసమంద్దృఢతరంసంమర్దయేద్ధస్తకైః । యద్ఘృష్టాద్యదధఃపతేచ్ఛుభతరంజాతంచధాన్యాభ్రకమ్ । పశ్చాచ్ఛుద్ధశిలాతలేదృఢతరంసంమర్దనీయంతదా । వజ్ర్యర్కోద్భవదుగ్ధఫేనుసలిలైర్బ్రాహ్మీస్నుహీదంతీబలా । వాసాచిత్రకశాల్మలీబలవరాకూష్మాండికాదాడిమీ । జాతీగోక్షురశంఖపుష్పలతికామోదామృతాబర్బరీ । ద్రాక్షామూలకరాక్షసీతులసికాముండీవిశాలామదా । గోజిహ్వాసలిలైర్విదారిలతికాభృఙ్గ్యుగ్రగంధాజల । శతపుష్పాతపనోద్భవైస్స్వరసకైస్సంవేష్టయేద్వైద్యరాట్ । రాత్రౌ సంపరిపాచయేద్గజపుటైస్సప్తైవవారాన్ పృథక్ । న్యగ్రోధస్యజటారసస్యసతతం కేశశతోయస్యచ । భావాశ్చైవపుటాశ్చవింశతిమితాః ఘృష్ట్వాకపిత్థస్యవై । చించిణ్యాఃఫలకోద్భవైశ్చ స్వసలిలైః శ్రీమత్పులే తాస్వితైః । పశ్చాన్నింబరసస్యఫేనుపయసస్సంమిశ్రగౌడస్యచ । దధ్నఃఖండఘృతస్యరమ్యామధునోవారాశ్చపంచాదశ । పశ్చాచ్చంద్రికయాభివర్జితమథాభ్రం వై సుశుద్ధంభవేత్ । రక్తంరమ్యతరంసుసేవ్యమవనీశానాంగణైస్సర్వదా ॥

తా ॥ కృష్ణాభ్రకమును రోటిలోవైచి మెత్తగదంచి పుల్లనికలిలోనానవేసియుండుండి ప్రాతఃకాలంబున గ్రహించి ఖల్వంబుననునిచి మెత్తగనూరి మరల కలిలోనానవేయవలయు. ఇటులనేడుమార్లుచేసి పిదప నొకకుండలో నుదకమువైచి దానిపైబట్టకట్టి యాబట్టపై అభ్రకపుముద్దను తగుమాత్రపు వరిపొట్టునునిచి హస్తముచే మర్దింపుచుండిన అభ్రకము కుండలో స్రవించు. పిదపనాకుండలోని పైనీళ్ళనువంచివేసి అడుగుననిలచియుండెడి అభ్రకమును గ్రహింపవలయు. ఇదియ శుద్ధధాన్యాభ్రకమనంబడు. ఈశుద్ధధాన్యాభ్రకమును ప్రక్షాళనము జేసిన రాతిపై నునిచి దృఢముగ మర్దింపవలయు. పిదప దానిని బొంతజెముడుపాలు, జిల్లేడుపాలు, గోమూత్రము, బ్రహ్మిచెట్టురసము, సంజీవని, మత్తవపులగము, అర్కసరము, చిత్రమూలము, బూరుగ, ఉలిమిడి, పిల్లిపీచర, కూశ్మాండము, దానింబ, జాజియాకు, పల్లేరు, శంఖపుష్పి, అజామోదము, తిప్పతీగ, వాయింట, ద్రాక్ష, ముల్లంగి, బలురక్కసి, తులసి, బోడతరము, వెఱ్ఱిపుచ్చ, మదా, ఎద్దునాలుకచెట్టు, నేలగుమ్ముడు, గుంటగలగర, నల్లనస, సోపు, నల్లజీడిగింజలరసము, వీనిరసములచే ప్రత్యేకప్రత్యేకములుగ నేడేడుమార్లుమర్దించి బిళ్లకట్టిసాయంకాలంబున ప్రత్యేకప్రత్యేకములుగ గజపుటంబులిడవలయు పిదప వీనిని మఱ్ఱివూడలరసము, ములువెలగరసము వీనిలో ప్రతిదానిచే నిరువదిమార్లు భావనచేసియిరువదియిరువదిపుటంబులిడవలయు. మఱియు దీనిని వెలగపట్టరసము, చింతపంపుగుజ్జు

దీనిచేభావనచేసి బాగుగపుటంబెడవలయు. మఱియు నిమ్మపండ్లరసము, గోమూత్రము బెల్లపుపానకము, పెరుగు, ఖండశర్కర నెయ్యి తేనెవీనిలో ప్రతిదానిచే ౧౨ భావన లుచేసి పుటంబుబెడవలయు–యిటులపుటంబులిడిననది పరిశుద్ధమై తెలుపు వర్ణముగువి డిచి యెఱ్ఱగనగు – ఇట్టిఅభ్రకమును రాజులుసర్వదా సేవింపుచుండవలయు.

అభ్రకగుణము.

శ్లో ॥ శుద్ధాభ్రంనను వల్లకద్వయమితంకృష్ణామధుభ్యాంయుతమ్। మేహశ్వాసవిషంచకుష్ఠమతులంవాతాంశ్చపిత్తాన్‌కఫాన్ । కాసక్షీణ క్షతక్షయగ్రహణికాపాండుభ్రమంకామలమ్।గుల్మాద్యంచయథానుపా నవిధినామృత్యుంచజేజీయతే ॥

తా ॥ ఇట్టిశుద్ధాభ్రకమున ఆరుగురిగింజల ప్రమాణము తేనె పిప్పలిచూర్ణము అనుపానముచేసి సేవించిన ప్రమేహము, శ్వాస, విషవికారము, కుష్ఠువు, వాతరోగ ములు, పిత్తరోగములు కఫరోగములు, కాస, క్షీణత్వము, గాయములు, క్షయము సంగ్రహణి, పాండువు భ్రమ, కామిల, గుల్మము మొదలగురోగంబులను, అకాల మృత్యువును బోకడచు.

శ్లో॥ (అన్యచ్చ) మృతాభ్రకంకామబలప్రదంచవిషంమరుచ్ఛ్వాస భగందరాద్యమ్। మేహాభ్రమంపిత్తకఫంచకాసక్షయం నిహన్త్యేవయ థానుపానాత్ ॥

తా ॥ మఱియు మృతాభ్రకము విషవికారము, వాతము, శ్వాస, భగందర ము, ప్రమేహము, భ్రమ, పిత్తము, కఫము, కాస, క్షయము, మొదలగురోగముల యథానుపానమువలన బోకడచుటయేగాక వీర్యవృద్ధి బలములసగా గలుగంజేయు.

అపక్వదోషము.

శ్లో ॥ చంద్రికాభియుతమభ్రకంయదా జీవితంఝడితినాశయే త్త దా। వ్యాఘ్రరోమణివచోదరస్థితంవాతనాళితను తేగదాన్బహూన్ ॥

తా ॥ అపక్వాభ్రకము జీవితమునుశీఘ్రముగనశింపజేయునదిగను, వ్యాఘ్రరో మసమానమైనానావుపద్రవకారిగను, శరీరంబున నెలకొని బహురోగకారిగనునుండు.

శ్లో ॥ (అన్యచ్చ) స్థూలకాయదైఃపుష్టైస్సైకైర్వరపక్వైర్వరభ్రకస్థి థా । యథావ్యాఘ్రిస్వరోమేవపంచత్వముపజాయతే ॥

తా॥ మాత్రాప్రమాణహీనంబును, పుటహీనంబునగు అభ్రకము వ్యాఘ్రరోగ తుల్యంబయి ప్రాణహానింజేయు.

## ముత్తియములశుద్ధి.

శ్లో॥ తురంగికిలాలాన్వితోడోలకెవైశుభం పాచయేన్మౌక్తికం చూర్ణమేవమ్ । దినైకంవిధేయోపివహ్నౌశ్చమందంశుభే కార్యకేయోజనీయంతతశ్చ ॥

తా॥ ముత్తియముల చూర్ణముచేసి పొట్లముగట్టి యొకకుండలో ఆడగుఱ్ఱపు మూత్రమునునించి డోలాయంత్రములో నొకదినము మందాగ్నిచే పక్వముజేసిన నది శుద్ధియగు.

## పత్థ్యవిధి.

శ్లో॥ సర్వాన్ధాతూపధాతూంశ్చయదా సేవతిమానవః। తస్య గోధూమచణకైస్తండులంచఘృతంపయః । శర్కరాభోజనేదేయాత్తైలంస్నానంచవర్జయేత్। అనుపానంసదాదేయంసుపక్వంసువిచారితమ్ ॥

తా॥ సువర్ణాది ధాతువులు ఉపధాతువులు, వీనిని సేవించెడి నరుడు గోధుమలు, సెనగలు, బియ్యము, నెయ్యి, ఆవుపాలు, శర్కర, వీనిని భోజనకాలంబున సేవింపవలయు-తైలము, స్నానము వీనిని వర్జింపవలయు- బాగుగపక్వముచేయబడిన సువర్ణాదిధాతువులయుక్తానుపానముగను, పరిమాణానుగుణ్యంబుగను, ఇసంగవలయు.

## శూలాదిరోగములయందుసువర్ణాద్యనుపానము.

శ్లో॥ శూలేహింగుఘృతాన్వితంమధుయుతాకృష్ణాపురాణజ్వరే వాతేసాజ్యరసోనకైశ్శ్వసనకేక్షౌద్రాన్వితంత్ర్యూషణమ్ । శీతేవ్యాలలతాదలంసమరిచంమేహేవరాస్సోపలాః । దోషాణాంత్రితయేనుపానముచితంసక్షౌద్రమార్ద్రోదకమ్ ॥

తా॥ వేయించిన యింగువ, నెయ్యి, వీటిని శూలరోగంబునను, మధుయుక్త పిప్పలి చూర్ణమును పురాణజ్వరమునందును, నెయ్యి, లశునములు, వీటినివాతరోగమునందును, మధుయుక్తత్ర్యూషణమును శ్వాసరోగమునందును, ఎఱ్ఱచిత్రమూలపాకు, మిరియాలు వీటిని శీతరోగంబునందును, త్రిఫలకషాయము, కలకండ, వీటిని ప్రమేహాం

బునను, తేనె, అల్లపురసము, వీటిని సన్నిపాతరోగములయందును అనుపానము జేయవలయు.

శ్లో॥ వనపర్పటకంజ్వరేగ్రహణ్యాంమథితం హేమవిషేవ మిషులాజా। కుటజోతిసృతౌవృషోష్ణపిత్తేగుడకీలేప్యనలక్షమేకృమిఘ్నః॥

తా॥ అడవిపర్పాటకమును జ్వరములయందును, సువర్ణభస్మమును చిలికినమజ్జిగతోడ సంగ్రహణులయందును, వరిపేలాలనువిషవికార వమనములయందును, కొడిశపట్టు, కొడిశవిత్తులు, వీటిని కఫ, పిత్తజనితఅతిసారములయందును, అడ్డసరమునుపిత్త గుదకీలము, అనలక్షమము, కృమిరోగము, వీనియందును అనుపానము జేయవలయు.

శ్లో॥ శూలవిస్ఫోటవాతేషువ్రణేషుడంభనక్రియా। రక్తస్రావే చాశ్మభేదేతథావృకీవిషూచికే॥

తా॥ శూల, విస్ఫోటకము, వాతరోగము, వ్రణము, మొదలగువానియందు డంభన క్రియను, రక్తస్రావము, అశ్మరి, విషూచి, మొదలగురోగములయందు వృకీక్రియను జేయవలయు.

శ్లో॥ వాతరక్తేబలిందద్యాచ్ఛిరోరోగేషుశంఠినా। అశ్మరీచతథాకృచ్ఛ్రేహేమాహారీతకీబలిమ్॥

తా॥ వాతరక్తము, శిరోరోగము, వీటియందుశంఠినిబలిదానము జేయవలయు అశ్మరీ, మూత్రకృచ్ఛ్రము వీటియందు తెల్లకరక్కాయను బలిదానమొసంగవలయు.

శ్లో॥ అపస్మారేచమూర్ఛాయాంతైలంవాయుసుశీతలమ్।ఊర్ధ్వవాతేబుద్ధిభ్రంశేదేవపుష్పంవచాసహ॥

తా॥ అపస్మారము, మూర్ఛ, వీటియందు తైలదానంబును, శీతవాతసేవనను జేయించవలయు. ఊర్ధ్వవాతము, (ఓకర) బుద్ధిభ్రంశము, వీనియందు వస, దేవపుష్పంబును, బలియొసంగవలయు.

శ్లో॥ ఉదరేతుపిప్పలీచక్షయేచగుడూచీతథా। పాండౌరసాదయఃశ్రేష్ఠాఃప్రదరేచరసాంజనమ్॥

తా॥ ఉదరరోగమున పిప్పలిని, క్షయరోగమునతిప్ప తీగెను, పాండురోగమున పాదరసాదులను ప్రదరరోగమునరసాంజనమును, దానమొసంగుటఅత్యంతశ్రేష్ఠము.

శ్లో ॥ దద్రుకండూపామకుష్ఠేచాకంగంధకపారదైః। లేపనాద్ధి భినేస్స్యాంతిర్గుథానేత్రేరసాంజనః ॥

తా ॥ దద్రుకుష్ఠను కండూరోగము, పామ, కుష్ఠువు మొదలగురోగంబులయందు పాదరస గంధకముల నేకముచేసి లేపనము చేసిన నవి శమించు. అట్లే అంగున నేనేత్రరోగంబుకు రసాంజనము (సుర్మా రాయివి) అంజనము చేసిన నేత్రరోగము నివృత్తియగు.

శ్లో ॥ ఏవమనుపానయోగేన భేషజం కారయేద్బుధః । యథారోగ్యంత థావస్థ్యం దేశకాలవయఃపునః ॥

తా ॥ దేశము, కాలము, అవస్థ, వీనిని విచారించి పూర్వోక్తఅనుపానముల ద్వారా వైద్యుడు ఔషధముల ప్రయోగింపవలయు.

ఇత్యనుపానమంజర్యాం ధాతుభిర్ధాతు మారణంతన్నోప
ధాతూనాంసంఖ్యాశోధనమారణాని ఏవంధాతూ
పధాతుసేవినః పథ్యాపథ్యప్రకరణంనామ
ష ష్ట స్స ము ద్దే శః.

ఔషధమానప్రయోజనము.

శ్లో ॥ నమానేనవినాయుక్తిర్ద్రవ్యాణాంజాయతేక్వచిత్ ।అతః ప్రయోగకార్యార్థంమానముచ్యతేమయా ॥

తా ॥ తూనిక వినా యుక్తిచే యేద్రవ్యమును ఔషధములయందు జేర్చుకొనగూడదు. కావున ఔషధమును గావించునెడ యందుపయోగింపవలసిన ద్రవ్యాదుల తూనికెను, కొలతను, మాగధపరిభాష చేనవచియించెద.

శ్లో ॥ త్రిసరేణుర్బుధైఃప్రోక్తస్త్రింశద్భిఃపరమాణుభిః॥త్రసరేణుస్తుపర్యాయనామ్నావంశీనిగద్యతే ॥

తా ॥ (౩౦) పరమాణువు లొక త్రిసరేణువనబడు. మఱియునీత్రిసరేణువునకు వంశియను నామాంతరముసగా గలిగియుండు.

పరమాణువు మొదలగునాటి వివరణము.

శ్లో ॥ జాలాంతరగతేభానౌయత్సూక్ష్మందృశ్యతేరజః। తస్యత్రింశత్తమోభాగఃపరమాణుస్సఉచ్యతే ॥

తా॥ సూర్యకిరణములు కిటికి మొదలగువాటిలో ప్రసరించునపుడు అందుగానం బడెడి అణువులో (30) వభాగము పరమాణువనంబడు.

శ్లో॥ జాలాంతరగతైస్సూర్యకరై ర్వంశీనిగద్యతే। షడ్వంశీభిర్మరీచిస్స్యాత్తాభిష్షడ్భిస్తు రాజికా।తిసృభీ రాజికాభిశ్చసర్షపః ప్రోచ్యతేబుధైః॥

తా॥ కిటికి మొదలగువాటియందు ప్రసరించెడి సూర్యకిరణములచేగానంబడెడినలుసువ వంశియనంబడు. అట్టి (౬) వంశీలోక మరీచియనియు(౬) మరీచులొక రాజకయనియు, (3) రాజికలొక సన్నఆవగింజ యొత్తనియు బఱంగు.

శ్లో॥ యవోష్టసర్షపైః ప్రోక్తోగుంజాస్యాత్తచ్చతుష్టయమ్। షడ్భిస్తురత్తికాభిస్స్యాన్మాషకో హేమధాన్యకౌ॥

తా॥ మఱియు (౮) ఆవగింజలొక యవగింజయనియు, (౪) యవగింజలొక గురిగింజయొత్తనియు, (౬) గురిగింజలొక మాషమనియు జెప్పంబడు-మఱియు నిమాషమునకు హేమమనియు, ధాన్యకమనియు, నామాంతరంబులు గలిగియుండు.

శ్లో॥ మాషైశ్చతుర్భిశ్శాణస్స్యాద్ధరణస్సనిగద్యతే। టంకస్స ఏవకథితస్తద్ద్వయం కోలఉచ్యతే। క్షుద్రభోవటకశ్చైవ వంక్షణస్సనిగద్యతే॥

తా॥ మఱియు (౪) మాషములొకశాణమనియు, ధరణమనియు, టంకమనియు, జెప్పంబడు. (౨) శాణములొకకోలమనియు, క్షుద్రభమనియు, వటకమనియు, వంక్షణమనియు బఱంగు.

శ్లో॥ కోలద్వయంచకర్షస్స్యాత్సప్రోక్తః ప్రాణిమానికా। అక్షం పిచుః పాణితలంకించిత్పాణిశ్చతిందుకమ్। బిడాలపదకంచైవ తథాషోడశికామతా। కరమధ్యోహంసపదంసువర్ణంకబలగ్రహమ్। ఉదుంబరంచపర్యాయైఃకర్షఏవనిగద్యతే॥

తా॥ మఱియు (౨) కోలములొకకర్షమనియు, పాణిమానికమనియు, అక్షమనియు, పిచువనియు,పాణితలమనియు, కించిత్పాణియనియు, తిందుకమనియు,బిడాలపదకమనియు, షోడశికయనియు, కరమధ్యమనియు, హంసపదమనియు, సువర్ణమనియు, కబళగ్రహమనియు, ఉదుంబరమనియు, జెప్పంబడు.

శ్లో॥ స్యాత్కర్షాభ్యామర్ధపలంశుక్తిరష్టమికాతథా। శుక్తిభ్యాంచపలంజ్ఞేయంముష్టిరామ్రంచతుర్థికా। ప్రకుంచష్షోడశీబిల్వం...మునావాతకీర్త్యతే॥

తా ॥ మఱియు ౨ కర్షములొక అర్ధపలమనియు, శుక్తియనియు, అష్టమిక యనియు, (౨) శుక్తులొకపలమనియుముష్టియనియు, ఆమ్రమనియు, చతుర్థిక మని యు, ప్రకుంచమనియు, షోడశీబిల్వమనియు, జెప్పంబడు.

శ్లో ॥ పలాభ్యాంప్రసృతిర్జ్ఞేయాప్రసృతశ్చనిగద్యతే। ప్రసృతిభ్యామంజలిస్స్యాత్కుడవోర్ధశరావకః। అష్టమానంచసంజ్ఞేయం కుడవాభ్యాంచమానికా। శరావోష్టపలంతద్వద్జ్ఞేయమత్రవిచక్షణైః ॥

తా ॥ మఱియు (౨) పలములలొక ప్రసృతియనియు, ప్రసృతయనియు, (౨) ప్రసృతలొకయంజలియనియు, కుడవమనియు, అర్ధశరావకమనియు, అష్టమానమనియు (౨) కుడవము లొక మానికయనియు, శరావమనియు అష్టపలమనియు, బఱంగు.

శ్లో ॥ శరావాభ్యాంభవేత్ప్రస్థశ్చతుఃప్రస్థైస్తథాఢకమ్। భాజనంకాంసపాత్రంచచతుష్షష్టిపలంచతత్ ॥

తా ॥ మఱియు (౨) శరావకములొక ప్రస్థమనియు (౪) ప్రస్థములొకఆఢకమనియు-భాజనమనియు, కాంసపాత్రమనియు, జెప్పంబడు. ఆఢకమన (౬౪) పలములు.

శ్లో ॥ చతుర్భిరాఢకైర్ద్రోణఃకలశోనల్బణోన్మనా। ఉన్మానశ్చఘటోరాశిర్ద్రోణపర్యాయసంజ్ఞకాః ॥

తా ॥ మఱియు (౪) ఆఢకము లొకద్రోణమనియు, కలశమనియు, నల్బణమనియు, ఉన్మనమనియు, ఉన్మానమనియు, ఘటమనియు, రాశియనియు, బఱంగు.

శ్లో ॥ ద్రోణాభ్యాంశూర్పకుంభౌచచతుష్షష్టిశరావకః। శూర్పాభ్యాంచభవేద్ద్రోణీవాహోగోణీచసాస్మృతా ॥

తా ॥ మఱియు (౨) ద్రోణము లొక శూర్పమనియు, కుంభమనియు, (౨) శూర్పములొక ద్రోణియనియు, వాహమనియు, గోణియనియు, చెప్పంబడు - ద్రోణి యన (౬౪) శరావములు.

శ్లో ॥ ద్రోణీచతుష్టయంఖారీకథితాసూక్ష్మబుద్ధిభిః। చతుస్సహస్రపలికాషణ్ణవత్యధికాచసా ॥

తా ॥ మఱియు (౪) ద్రోణులొకఖారియని జెప్పంబడు - ఖారియన (౪౦౯౬) పలములు.

శ్లో ॥ పలానాంద్విసహస్రంచభారఏకఃప్రకీర్తితః। తులాపలశతంజ్ఞేయంసర్వత్రైవైషనిశ్చయః ॥